

# గురుపదశతకము

ఇది

పాకాలా

భారత భాగవతాద్యనేక పురాణప్రసంగికులు,

కరణం గంగాధరపిళ్లగారిచే

ప్రణీతము.

ఆరణి చెంగల్ రాయ ఆచారిగారి

పరిశోధితము.

శ్రీ శారదాముద్రాయంత్రాలయముద్రితము

చిత్తూరు.

పుస్తకము వెల] 1913. [అణాలు ౨

శ్రీగురుభ్యోనమః

హరిః ఓం. శ్రీరస్తు.

చిదానందగురుప్రణీత



పాకాలనివాసియును కరణంశిద్ధపిళ్లకుమారుడును
భారత భాగవతాద్యనేక పురాణప్రసంగియును
రాజవోలు వెంకటాచలగురుశిష్యుడును
దాసదాసులకుదాసుడునగు

# కరణం గంగాధరపిళ్ళ గారిచే

రచియింపబడిన

# గుణేపమ శతకము

ఇది

వేదాంతసార సంగ్రహంబై
సర్వజనోపయుక్తంబై విలసిల్లుచుండునని
శుసిరాస్త్రిరు

## S. మునిరత్నపిళ్ళ

వినయప్రార్థనపై
శారదాముద్రాక్షరశాలలో
ముద్రింపబడినది.

చిత్తూరు.

1913. [వెల 0-2-0.





శ్రీరస్తు.

# గురుస్తోత్రం

## ఆరభిరాగం. ఏకతాళం.

## శ్రీరఘురామునిదివ్య. అనువర్ణమెట్టు.

1. నిర్వికారగ బ్రహ్మం నిగుణంనిష్ప్రపంచం॥ని॥సచ్చిదానందరూపం సర్వేశం సద్గురుం ॥ని॥ ఈషణాత్రయరహితం యిహపరవర్జితం అంతరాత్మస్వరూపం। అఖిలేశం సద్గురు ॥ని॥ మాల్యకంఠాపురి మహితగురోత్తమం వెంకటాచలార్యం వేదవేద్యం సద్గురుం ॥ని॥

## హిందుస్తానితోడి రూపకం.

## గంగాధరాణాంయను హిందుస్తానివర్ణమెట్టు.

2. గురురాయునిదలచివేడుకతోను కొనియాడెద ॥గు॥ కొనియాడెద కొనియాడెద కొనియాడెద ॥గు॥ గుణత్రయరహితు ముక్తికాంతాసహితు స్తుతియించెద పుండరీకాక్షు భువనప్రశస్తు నతజనపక్షు నామమోహన ॥గు॥ సచ్చిదానందు హృత్కమలమందునన్నుతించెద శంఖాద్రియందు శిష్యులనిందు ధారిద్ర్యముందు తాండవమొందు ॥గు॥ కారణగురుని కరుణసౌహృదుని కనుచునుండెద వేదవేద్యుని సంగరహితుని వేదాంతనిధిని వెంకటాచల ॥గు॥

## వినాయకస్తుతి.

3 గజముఖనన్నుబ్రోచి కావుమయ్యావిఘ్నరాజ ॥గ॥ నిన్నునమ్మియున్నవాడ నీలకంఠసుకుమార ॥గ॥ వల్లభీప్రాణనాథ పరములొసగు గుణబోధ కరుణించు సుమారాగ్రజకరుణాసాగరనీవు ॥గ॥ శంఖగిరియందువెలయు శశివాళిపదసుమార పాస్వతిసుతుడపట్టి గంగాధరునిచెట్టి ॥గ॥

# శ్రీగురుపదశతకము.

. కోటిసూర్య సమప్రభాతితకూటస్థమైనది గురుపదం।
కోటిచంద్రసుశీతలంబై సాటిలేనిది గురుపదం।

. ప్రాకటాజ్ఞానాంధకారదివాకరము శ్రీగురుపదం।
శ్రీకరంబుగ యోగిచిత్తవశీకరము శ్రీగురుపదం।

4. ఘోరమగుసంసారవారధితారకము శ్రీగురుపదం।
క్రూరపాతకగహనదగ్ధకుఠారకము శ్రీగురుపదం।

5. ధాత్రిభవబంధోగ్రపాశలవిత్రమే శ్రీగురుపదం।
పుత్రదారధనసుమహాతపత్రమే శ్రీగురుపదం।

6. క్షేత్రమహిమసమాజపటుతరక్షేత్రమే శ్రీగురుపదం।
చిత్రమగుపరబ్రహ్మమువెలిగించుసూత్రమే శ్రీగురుపదం।

7. [illegible]మువెన్నెలబట్టబయలునునిండియున్నది గురుపదం।
కుండలినిపెకలించిచూపితేగోచరించును గురుపదం।

8. అండపిండబ్రహ్మాండములదానంటకున్నది గురుపదం।
మండలత్రయములనుదాటినమహిమజూపును గురుపదం।

9. నాదబిందుకళాత్మకంబై సాక్షమైనది గురుపదం।
భేదమోదములందుచేరనిఅనాదిరూపము గురుపదం।

10. శుద్ధసత్వరజస్తమోగుణశూన్యమైనది గురుపదం।
బుద్ధిగుణాలనుదోఁచివెల్గుచుపూర్ణమైనది గురుపదం।

11. చూపులోపలపాపకావలచూడబడును గురుపదం।
రూపులన్నియుమాపివేసినదీపరూపము గురుపదం।

12. నీలజలదస్థితతటిద్ద్యుతినిభమునందగు గురుపదం।
పాలభాగమునందు రాత్రింబగలు వెల్గును గురుపదం।

13. ఒంటిగను విలసిల్లి దేనిని నంటకుండును గురుపదం।
రెంటితోఁగలయకను వెల్గును నిర్విరాజసు గురుపదం।

14. మూడుమూర్తులకెల్ల మొదలిటిమూర్తియైనది గురుపదం।
మూడుమూళ్లనుదవ్వులకు దానొనయుచుండును గురుపదం।

15. నాల్గుసాధనలొనరజేసిననాలకగుపడు గురుపదం।
నాల్గు నాల్గువికారములుతిన్నగనడచును గురుపదం।

16. పంచవర్ణాతీతమైచూపట్టుచుండును గురుపదం।
పంచవింశతత్త్వములపై బరగుచుండును గురుపదం।

17. ఆరుమంత్రములదవ్వులకుండినదాదదగినది గురుపదం।
ఆరుచక్రంబులకునావలనలరుచున్నది గురుపదం।

18. సప్తయుగభువనములనంతయువ్యాప్తమైనది గురుపదం।
గుప్తముగదహరాంబరమునగోచరించును గురుపదం।

19. అష్టమదములనడచువారికి అనుభవంబగు గురుపదం।
అష్టదళపద్మమునదిరిగెహంసరూపము గురుపదం।

20. తొమ్మిదిద్వారములపురమునదూరియున్నది గురుపదం
నెమ్మదినిశృంగాటకముపైనిలచియున్నది గురుపదం।

21. దశసమీరణబంధనముచేవశముగానిది గురుపదం।
విశదముగపదునొకండింద్రియవిషయమొందదు గురుపదం।

# శ్రీగురుపదశతకము.

ద్వాదశాక్షరిబలికినటువలెపాదుకొన్నది గురుపదం।
మీాదిషోడశమంత్రవిధమునుమీారియున్నది గురుపదం।

అరయముప్పదియారుతత్వములందులేనిది గురుపదం।
పరుసపణ్మ్రవతత్వములకువివశ్యమైనది గురుపదం।

క్షుద్రకలశజ్యోతివిధమునవెలుగుచున్నది గురుపదం।
నిద్రవిడచియునిలచిచూచిననిండియున్నది గురుపదం।

వేదశాస్త్రపురాణములకనరాదు శ్రీమద్గురుపదం।
మోదమునదేశికునికృపచేవేదితంబగు గురుపదం।

పంచముద్రాభ్యాసములచేపట్టుబడినిది గురుపదం।
సంచితాగాములనువేగదహించిన। ,,

మించిస్నానజపాదులనుసాధించరానిది ,,
వంచనాపరులకునుదెలియగవశముగానిది ,,

భూతిరుద్రాక్షలుధరించుటచేవదెలియదు ,,
పీతరంగద్వేషములకుకనుపించుచున్నది ,,

నేతినేతిసువాక్యములచేనిశ్చయంబగు ,,
ఖ్యాతిగావెలుగొందునాపాజ్యోతిరూపము ,,

సూరిజనచయహృదయపంజరకీరమే ,,
భూరినిగమాంత్రార్థనిర్మలసారమే। ,,

ప్రజ్ఞచేసర్వంబులోగానిప్రబలుచున్నది ,,
ప్రాజ్ఞనామముచేతసుప్తికినశ్యమైనది ,,

32. మూడవస్తులకవలదుర్యముగూడియున్నది గు॥ దం
మూడబడకనుదుర్యమునుదాజూచుకున్నది ,,

33. కల్పకోటిశతంబులైననుకదలకున్నది ,,
కల్పములుగల్పించుటకుజాగామిన్యైనది ,,

34. ద్రష్టదర్శనదృశ్యములతోదవిలియున్నది ,,
ద్రష్టదర్శనదృశ్యములకువిశిష్టమైనది ,,

35. భోక్తయైభోజ్యములనెల్లనుబొందుచున్నది ,,
వక్తయైవాక్యములనెల్లనుబలుకుచున్నది ,,

36. శ్రోతయైశబ్దములనెల్లనుబ్రీతితోవిను ,,
దాతయైదానంబులెల్లనుదానెయిచ్చును ,,

37. వర్తయైకాలమునెల్లనుగడగిచేయును ,,
మూర్త్యమూర్త్యద్రవ్యములకునుమూలమైనది ,,

38. బాధ్యబాధకములకుదానునబాధ్యమైనది ,,
బోధ్యబోధకములకుదానునబోధ్యమైనది ,,

39. కోరియాధారమునదాగూడియున్నది ,,
నారణాసనుడనగననయముపేరుగొన్నది ,,

40. దారుణినిపడ్డలసుచక్రవిహారియైనది ,,
వారిజాసనునామమునుదావడసియున్నది ,,

41. నిరతమునుమణిపూరకంబునదిరుగుచున్నది ,,
గరుడకేతననామమునదాగ్రాలుచున్నది ,,

42. పదిలముగపదారెండుదళములపైన నెలకొను గురుపదం,,
మదనవైరిసమాఖ్యచేతను బొదలుచున్నది ,,

43. పరుసతోడవిశుద్ధచక్రనివాసమైన ,,
పరగునగు జీవాత్మసంజ్ఞను బరగుచున్నది ,,

44. నిర్మలాజ్ఞాయాకారము సదానించియున్న ,,
కూర్మితో పరమాత్మసంజ్ఞను కొమరుమిగిలెను ,,

45. వేయిరేకులతమ్మిమీదను నెలసియున్నది గురుపదం
శ్రీయుతంబుగ దేశికాఖ్యము జెలువుగాంచెను గురుపదం

46. ధరణికారణయుగమును పరునాధారమైన ,,
బరగబంచాకాశమధ్యవిభాసితము శ్రీ ,,

47. ప్రబలుసుదవిలిన బాహ్యదృష్టిని బూసియున్నది ,,
విమలముగ లోచూపుచూచిన పదపదము ,,

48. చిత్కళాయుక్తంబై సాక్షిత్వమైనది ,,
హృత్కమలమున గోప్యదీరియమైనది ,,

49. మానసప్రాణములు నిశ్చలమైనగ నడగు ,,
కానబడు బహుకాంతులలో కలసినటువలె ,,

50. మల్లెమొల్లలు జల్లినటువలె మదికిదోచును ,,
తెల్లముగ ముత్యాలసరములటు గనపడు ,,

51. లీలనవరత్నములగతి నసలీలదోచును ,,
చాలుగా దీపములు బెట్టినసరణి వెల్గును ,,

52. మానవప్రాణములు నిశ్చలమైన గనదగురుపదం।
కానబడు బహుకాంతులతో గలసినటువలె గురుపదం।

53. మల్లెమొల్లలు జల్లినటువలె మదికిదోచును గురుపదం।
తెల్లముగముత్యాలసరముల తీరుగనపడు గురుపదం।

54 లీలనవరత్నముల గతినవలీలదోచును గురుపదం।
చాలుగాదీపములుబెట్టిన సరణివెల్గును గురుపదం।

55. సుందరంబగు నలలవిధమునజూడబడు శ్రీ గురుపదం।
కుందనపుబంగారువలె తళుకునవెలుంగును గురుపదం।

56. తారకామండలము రీతినిదర్శనంబగు గురుపదం।
సారెకునుదోలుకారిమెరుపుల సరణివెల్గును గురుపదం।

57. భానుకోటిని భాబనిర్మల భాసమానము గురుపదం।
మానుగాసంపూర్ణచంద్రిక మాడ్కి మెరయును గురుపదం

58. నిత్యమైపరిపూర్ణమైమహా నియ్యమైనది గురుపదం।
నిత్యమైయవికారమైనా శంబులేనిది గురుపదం।

59 అద్వితీయంబై యఖండంబై వెలుంగును గురుపదం।
విద్వదాళి మనోంతరిక్షుని వేశమైనది గురుపదం।

60. అన్నరూపము బొందియున్నిట నున్నదిగురుపదం।
అన్నమయకోశంబు లోపలనణగియున్నది గురుపదం।

61. ప్రాణకర్మేంద్రియములకు స్వాధీనమైనది గురుపదం।
ప్రాణమయకోశంబు నాగనుప్రబలియున్నది గురుపదం

62 మానసజ్ఞానేంద్రియములను మరిగియున్నది గురుపదం।
మానితముగమనోమయంబున మహిమగన్నది గురుపదం।

63 బుద్ధియుతజ్ఞానేంద్రియంబుల బొందియున్నదిగురుపదం।
శుద్ధముగవిజ్ఞాన మయమునజూడబడినది గురుపదం।

64. పొందిప్రియమోద ప్రమోదానందమైనది గురుపదం।
యెందుగన్న నానందమయమై యెనగుచున్నది గురుపదం

65. పంచకోశములందు నుండియుపట్టుబడినది గురుపదం।
పంచకోశంబులకు నవ్వలప్రబలమైనది గురుపదం।

66. వాసనాత్రయ వనులకెప్పుడు వడయరానిది గురుపదం।
దాసులై సేవించువారిని దాపుచేర్చును గురుపదం।

67. తానునేనను భిన్నవాదుల దండనుండదు గురుపదం।
తానుతానైయులరుచుండిన తత్వరూపము గురుపదం।

68. ధరనుసంశయ చిత్తులకు లబ్ధంబుగానిది గురుపదం।
గురుకృపాపాత్రులకునయముగోచరించును గురుపదం।

69 తత్వమసిముఖనిఖిల వాక్యార్థప్రభావమె గురుపదం।
తత్వవేత్తలుపొందదగిన నిదానమెశ్రీ గురుపదం।

70. మాయతోడను గూడిశివనామంబునొందెను గురుపదం।
ఆయవిద్యను గూడిజీవసమాఖ్యనొందెను గురుపదం।

71. ఉభయవాచ్యార్థములదవులక నొప్పుచున్నది గురుపదం।
వుభయలక్ష్యార్థముల చూచిననొక్కటైనది గురుపదం।

72. త్రివిధలక్షణ భావములచే తెలియువలె శ్రీగురుపదం।
భువిజహాలక్షణముచే బొందరానిది గురుపదం।

73. కడగియజహల్లక్షణముచే గానబడదా గురుపదం।
విడచివిడువనిలక్షణముచే విశదమగు శ్రీగురుపదం।

74. బురదనంటకదిరుగు కుమ్మరపురుగు విధమగు గురుపదం।
క్షురమునంటియు నంటకసు దానరగునున్నది గురుపదం।

75. జలజజలములల భంగిమాయను గలయకున్నది గురుపదం।
వెలయజిహ్వాద్యముల వలెగుణములకు వేరగు గురుపదం।

76. ముకురముఖముల గతీసవిద్యను ముట్టకున్నది గురుపదం।
ప్రకటదధిభవత క్రమువలె బ్రకృతినంటదు గురుపదం।

77. దారుదహనుల రీతిననయము దనరుచున్నది గురుపదం।
ధారుణినిధరశైలమువలె ధన్యమైనది గురుపదం।

78. కుసుమగంధవిధంబుగా నొనగూడియున్నది గురుపదం।
రసఫలంబుల రీతినుందినిరంతరము శ్రీగురుపదం।

79. ప్రీతిచేతనివాత దీపమురీతినున్నది గురుపదం।
సీతవాతాతపములను లక్షింపకున్నది గురుపదం।

80. ఆకశమునవతీతమై తానలరుచున్నది గురుపదం।
ఆకశమువలెనంతటను దానమరియున్నది గురుపదం।

81. పూర్ణమైబాహ్యాంతరంబుల బొసగుచున్నది గురుప ।
అర్ణగర్భస్థితఘటస్థితియగుచున్నది గురుపదం।

82. నామరూప వివర్జితంబై క్షేమమైనది గురుపదం।
ధీమనోవృత్తులను నంటనిదివ్యధామము గురుపదం।

83 యిక్కడక్కడ ననకసన్నిట పిక్కటిల్లెను గురుపదం।
వాక్కులకువశీకృతంబై చిక్కపడదా గురుపదం।

84. అప్పుడిప్పుడు ననకనెప్పుడు నొప్పుచున్నదిగురుపదం।
గొప్పకొంచెముల నెడుతిప్పల కుప్పతిల్లదు గురుపదం।

85. ఎండమావులవంటిజగముల నెన్నడెరుగదు గురుపదం।
నిండుకొనిసాగరమురీతిని నిలచియున్నది గురుపదం।

86. పూనిప్రకృతిద్వయ వికారముబొరయకున్నది గురుపదం।
మేనులెన్నొవచ్చి యేగినమిన్నకున్నది గురుపదం।

87. మెరుకమరువులనెరుగు నెరుకను నెరుగకున్నది గురుపదం
యెరుక కేసర్వంబొసంగియు నేమియెరుగదు గురుపదం।

88. ముల్లుమోపను దాపులేకను జెల్లుచున్నది గురుపదం।
మెల్లతనువుల సందుతానైమెసగుచున్నది గురుపధం।

89. వినదువినురుచిగొనదుకొనుమూర్కొనదుమూర్కొనుగురుపదం।
కనదుకనగొను స్పరిశమును గైకొనదు గైకొను గురుపదం।

90. పలుకుపలుకదు తలపుతలవదు భ్రమలజెందదు గురుపదం।
అలపుజెందదు సంతతము వ్యాకులమునొందదు గురుపదం।

91 విసుకుజెందదు తామసింపదు విశ్వసింపదు గురుపదం।
దెసలకురుకదు వసుధదూరదు దివికిబారదు గురుపదం।

92\. చింతగూరదు పంతగించదు సంతసింపదు గురుపదం।
వింతసేయదు విఱ్ఱవీగదు వంతులాడదు గురుపదం।

93\. ఎండకెండదు నీటగలయదు తిండికోరదు గురుపదం।
అండజాయదు హత్యబొందదు హానిచేయదు గురుపదం।

94\. వాననానదు వహ్నిగాలదు వరదబోవదు గురుపదం।
బాణములచే బాధజెందదు భవమునొందదు గురుపదం।

95\. రట్టుగొట్టదు తిట్టతిట్టదు పట్టుపట్టదు గురుపదం।
వొట్టుబెట్టదు గొట్టుగొట్టను జెట్టబట్టదు గురుపదం।

96\. ముందువెనుకను రెండుప్రక్కల ముట్టియున్నది గురుపదం।
సందుగొందుల ప్రబలియున్నది సార్వకాలము గురుపదం।

97\. మొదలుతుదిమధ్యములు లేకనుమూగియున్నది గురుపదం।
ఋదివరకు సుఖముందు నెప్పుడుబెదరకున్నది గురుపదం।

98\. హరులోపలకిరులలోపల సరిగనున్నది గురుపదం।
చరులలోపల గిరులలోపల నలమియున్నది గురుపదం।

99\. చీమలోపల దోమలోపల చేరియున్నది గురుపదం।
పాముమొదలగుజంతువులలో ప్రబలియున్నది గురుపదం।

100\. ఒకనిరూపణలేకనిండుగ నున్న దెప్పుడు గురుపదం।
సకలజంగమస్థావరములను సమతనున్నది గురుపదం।

101\. నేనునేనను వృత్తులను దాగానకున్నది గురుపదం।
కానబడుప్రారబ్ధకర్మల గాంచకున్నది గురుపదం।

102. అదియునిదియును ద్వైతభావమునందకున్నది గురుపదం।
అదియునిదియు నొకటయ్యెనున్నది యచలమైతాగురుపదం।

103. చచ్చిపుట్టుటనన్న భ్రమలకు జొచ్చకున్నది గురుపదం।
ఎచ్చుతగ్గులులేకబయలై యేకమైనది గురుపదం।

104. భ్రాంతిదోచినయపుడు దానైబలసియున్నది గురుపదం।
భ్రాంతివిడచినయపుడు నిజమైప్రబలుచున్నది గురుపదం।

105. ఉన్నదున్నది యున్నదున్నది యున్నదిదిగో గురుపదం।
కన్నవారికిన్నచోటనే కనబడును శ్రీగురుపదం।

106. భువినివెంకటసివగురు ప్రభుపూర్ణభావమే గురుపదం।
వివరముగానారాయణాహ్వయక వికివేద్యము గురుపదం।

107. పొంకముగను జిదంబరాకృతిబొందియున్నది గురుపదం।
వెంకటాచల మంత్రిమదిలో వెలసియున్నది గురుపదం।

108 అంగజారివినుత పాత్రమైనలరుచున్నది గురుపదం।
గంగాధరునిదుర్గుణంబులు జిదుముచున్నది గురుపదం।

కందపద్యము.

వినువీథి కినపరంబున వినువీథిగతించె లంగువిభుడతి కృపతో
మనుచును కామ్యార్థ్యము లిడివిను తుండగురాజి వోలువెంకటగిరినిం

తత్సద్బ్రహ్మార్పణమస్తు.

శ్రీ గురుపదశతకము సంపూర్ణం.

శ్రీరామజయం.

# ముద్రసహాయాధికారులమంగళశాసనము.

సీ॥ చిత్తూరి కుత్తరదిగ్భాగమందున। ఉత్తమమైనట్టి యుచితస్థలము॥
తిమ్మసాగరమన యెమ్మెకెక్కినయట్టి। బ్రహ్మపురమునకుపమయౌ
పురంబు। అయినేరినరసాభిదా సుదైమహిమను। నలరుధన్యాత్మకు
డందునమరు॥ వారిపుత్రులలోన వరగుణాంబుధి జ్యేష్టుడైన వేంకట
శిద్ధాహ్వాయుండు।వారిసోదరుడైనట్టి వరగుణాఢ్యు। నారమయనంబు
గాగొన్ననాధుభక్తు। అనుసరించిన జనులకభీష్టఫలదు। డైనమున
సామిరెడ్డిగారవనియందు॥.

సీ॥ చిత్తూరుపురమునస్థాపించబడినట్టి। ముద్రాక్షరములకు మూలమైన।
శారదాప్రెస్సనుశ్లాఘనీయంబైన। వారధిసమమైనవరగృహంబు।
నందురైటర్లవుద్యోగంబులందున్న। దైవశిఖామణిధన్యచరతు। ముని
రత్నపిళ్లనుముఖ్యమౌనామంబు। సార్థకంబుగగొన్నసరసభాషు। వీర్ల
కెల్లనుసర్వకాలంబులందు। ఆదిశేషునకైననునలవిగాని। వేదముల
సారమైనట్టివేదవేద్యు। డిచ్చునెప్పుడుపుత్రపౌత్రాభివృద్ధి॥.

శ్రీ. శ్రీ. శ్రీ.

